శ్రీరామ శరణము.

శ్రీమదాంధ్రమహీమండల మండనాయమానం బగు గుంటూరు పురంబున అరండల్పేటలో శ్రీ పాటిబండ సూర్యనారాయణరావుగారిచే స్వగృహ సమీపమున నొక నూతన దేవాలయము నిర్మింపఁబడియె. ఈదేవాలయ నిర్మాణపద్ధతికిని పూర్వపు దేవాలయ నిర్మాణ పద్ధతికిని చాల భేదము కలదు. వెనుకటి దేవాలయంబులనున్న మూల విరాట్టులు దేవాలయంబునఁ బ్రవేశించినవారికిఁ గాని గోచరంబులు గావు. ఈనూత్ననిర్మిత దేవాలయమునందలి మూలవిరాట్టులు వీధిలో నెచ్చటనుండి చూచినను నేత్రగోచరంబులై చూచు భక్తులకు మహానందసంధాయకములై యెట్టివారికేని హృదయాకర్షకములై భక్త్యుద్రేకమును గలిగింపక మానవు. ప్రాచీన దేవాలయమ్ములు,

గర్భగేహములందు శుభ్రవాయుపరిచారంబునకు వీలు లేక గబ్బిలములు, మూషకములు మున్నగు క్షుద్రజీవముల కునికిపట్టులై, గాఢాంధకారబంధురంములై, దుర్గంధభూయిష్ఠంబులై వ్యాధిసన్నిధయం దొకక్షణమేని నిల్చుటకుఁ దగిన యుత్సాహము గలిగింపక ప్రేక్షకుల కసంతుష్టికరములై యుండును. ఈ క్రొత్త దేవాలయము దృగ్గోచరమైనఁ జాలును. ఎట్టి నాస్తికునకైనను మనస్తుష్టినొందక మానఁడు. గర్భాలయమునందు పరిశుద్ధవాయుసంచారముండుటయు, వెలుతురు నిరాటంకముగను బాగుగను నిల్పుకొని చెలంగుచుండుటయును ఈ దేవాలయమున కితరాలయములకంటె వైలక్షణ్యమును దెచ్చుటకు ముఖ్యకారణములు. ఇట్టి నవీన నిర్మాణపద్ధతి శ్రీ సూర్యనారాయణరావుగారి మనంబున స్ఫురించుటకుఁ దదస్ఖలిత భక్తిపరవశుఁ

డగు శ్రీమదాంజనేయుని యనుగ్రహమే నిశ్చయింప వచ్చును. మఱియు నీదేవాలయము నాటించి యీ మహాపురుషుఁడే యొక్క దృఢసౌధమును నిర్మించి యందు వివిధ సంస్కృతాంధ్ర గ్రంథరూపిణి యగు సరస్వతింబాఁడఁ బ్రతిష్ఠచేసి యుంచుటచేత "స్వామిదర్శనమువలన నెపుడో జన్మాంతరమున ఫలముకల్గును" అను కింవదంతి మిథ్యయై తత్కాలముననే గ్రంథదర్శనజమగు జ్ఞానరూప ఫలము లభ్యమగుట గొప్ప విశేషము ఇంతియగాక యీ భక్తవరుఁడు, శ్రీమదాంజనేయునందుఁ గలవని మనము చెప్పికొనునట్టి సర్వవిధ మహిమలను జక్కఁగ సహేతుకముగ సమర్థించుచు స్వభక్తిపారవశ్యమును దెల్పునట్టి ముప్పదియారు పద్యరత్నములను ధారాశుద్ధియు భావస్ఫూర్తియు రసపుష్టియు ముప్పిరిగొనునటు రచియించి శ్రీస్వామి

వారి కర్పణచేసెను. ఈపద్యముల నొక్కొక పద్యమున కొక్కొక ప్రదక్షిణ నమస్కారము వంతునఁ ద్రిరావృత్తముగఁ బఠించినచో అష్టోత్తరశతసంఖ్యాక ప్రదక్షిణ నమస్కారములు సిద్ధించును. ఈ ముప్పదియాఱు పద్యరత్నములకును 'శ్రీహనూమత్స్తవరాజము' అని పేరు. "చిన్న గుళ్ళు చాలవా యీదేవాలయమేల" యని కొందఱకు ప్రస్తుతకాలీనుల కున్నను తొంటి దేవాలయములకన్న ననేకరీతుల నీ దేవాలయము ప్రకృతకాలమునందుఁగూడ బహు లాభకరమైన దనియే వాదృఢ నిశ్చయము. ఆర్యమహాశయులారా! 'కింబహునా' యను నట్లు పెక్కు వ్రాయనేల, దేవాలయముల నిషేధించువారే నియు నీ దేవాలయము నొక్కమారు గాంచినచో, నిట్టి దేవాలయము లావశ్యకములు అనకపోరు. కావున యీ దేవాలయమున నెలకొన్న

మూ॥ విరాజితుం డగు శ్రీమదాంజనేయస్వామి, దినదిన ప్రవర్ధమానసాన్నిధ్య బలముఁ గలవాఁడై, శ్రీహనూమత్ స్తవరాజముచేఁ దనను బాగుగ భక్తవరులకు నశేషైహికాముష్మిక క్షేమముల నొసంగుచు నాచంద్రతారముగ శ్రీ పాటిబండ సూర్యనారాయణరావు గారిని బ్రోచుఁగాత.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,

7-4-1920

కాశీ కృష్ణాచార్యులు.

శ్రీహనుమతేనమః.

# విజ్ఞప్తి.

మహాభక్తుఁడు నిష్కళంక ప్రవర్తనుఁ కవియునైన మా తండ్రి పాటిబండ వేంకటప్పయ్యగారి యాశీర్వాదమువలనను, భగవత్కృపవలనను బాల్యమునుండియు నాకుఁ మానసికభక్తి సహజమై యున్నది. నాజన్మస్థానమైన సత్తెనపల్లితాలూకా పాటిబండ యను గ్రామములో గ్రామముమధ్యను సహజముగాఁ బుట్టిన కొంచమెత్తుగల యొకచిన్నిబండమీద నాలుగుస్తంభముల మంటపములో శ్రీప్రసన్నాంజనేయస్వామి ప్రతిష్ఠింపఁబడియుండెను గుడిలోనికి బోవలసిన యవసరము లేకయే, యర్చకుఁడువచ్చి తెలుపుదీయవలసిన ప్రసక్తి లేకయే, యాస్వామి ప్రత్యక్షమగుచుండును. స్వామివారికి పేరిట

కులు నమస్కరించినను నమస్కరింపకున్నను ప్రేక్షకులను బిలచి వారికి స్వామివారే భక్తి ప్రపత్తి మార్గములను శిక్షించుచుండెనో యన్నట్లు తోచుచుండును. నాకుఁగల సహజభక్తిచేతను స్వగ్రామమునఁ గల శ్రీ ప్రసన్నాంజనేయస్వామివారి యాలయ విగ్రహముల వైఖరివలనను, గుడియు దేవుఁడును భక్తి ప్రేరకములుగా నుండవలయునని మనమున దృఢముగా నాటియున్నది.

గుంటూరు అరండల్పేటలో నేను స్వగృహమును సంపాదించుకొన్న పిమ్మటఁ దత్సమీపములో మఱికొంత నివేశనస్థలము సంపాదింపఁదలచి యాస్థలము లభించు ప్రయత్నము విషయమై ముచ్చటించుచు నొకనాఁడు విలాసముగా మాటలసందున ఆస్థలము లభించునెడ నందొక చిన్ని యాలయము కట్టించు కోర్కె గలదని చెప్పితిని. కష్ట

ముఖ్యాద ఆస్థలము తరువాత కొంతకాలమునకు లభించెను. వారి శక్తి
గాంచి కొద్దిద్రవ్యమును ప్రయోగించి భూమిమట్టముమీద చిన్నదద్ద
కమును నేర్పఱుప నూహించితిని. ఏదేవుని యాలయమో నిర్ధారణ
చేయు విషయమున, మానసిక సహజభక్తియు, జన్మస్థానమందున్న
శ్రీ ఆంజనేయస్వామివారి యాలయ వైఖరియు, గుంటూరు అరండల్
పేటలో ఆస్వామివారి గుడి లేకపోవుటయు ఆస్వామివారే సర్వసమ్మత
దైవముగా నుండుటయు నన్ను ప్రేరేపింప శ్రీ ఆంజనేయస్వామి
వారిని ప్రతిష్ఠింప నిశ్చయించితిని. పిమ్మట జన్మస్థానములోగల గుడికి
దేవునికి ఔన్నత్యమును దెచ్చుచు గ్రామమధ్యమున సహజముగా
నున్న చిన్న తిప్పవంటిది యిచ్చట నేర్పడిన బాగుగనుండెడి యని
తోచెను. గుంటూరులో గొండయేర్పడుటెట్లు అంతట నేనైనను

నాకే యనుకొని కొంచమెత్తైన చిన్నతిప్పలాగు కట్టడము నేర్పరుప
వలయునని నిశ్చయించి జన్మస్థానమునే మాతృకగా గ్రహించితినిగాన
దీనికి "ధర్మాచల" మను పేరిడ సంకల్పముచేసి అది ఆచంద్రతారా
ర్కము సార్థకనామధేయముగా నుండవలయునని దేవుని ప్రార్థించి
తిని. తదన్నను చిత్యర్థమై ప్రజలకు భక్తిని ప్రేరేపించురీతి ప్రధాన
మూర్తిగా శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివారిని అందు ప్రతిష్ఠింప
దలచి శ్రీ ప్రసన్నవీరాంజనేయ మూర్తులుగూడ సంగండ నేర్పరచి
ధర్మాచలమందుండు స్వామి "త్రిమూర్తిహనుమంతుం" డని పిలువ
నెంచి శ్రీ హనుమత్స్వామి త్రిమూర్త్యాత్మకుండుగాన ఆపేరు అన్ని
విధములు సార్థకమని సంతసించితిని. అంతటితో తృప్తిజెందక ప్రస్తుత
కాలములో దేవాలయములు విద్యావంతులకును, ఉద్యోగస్థులకును,

పఠన మందిరములవలెను (Town Halls) సమావేశ మందిర (Clubs) ములవలెను రుచించి ప్రోత్సాహము ఆకర్షింపకపోవుటచేత అట్టివారిని సమ్మిళితము రప్పించు మార్గమాలోచించి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులవారిని సంప్రదించి వారి సంపూర్ణామోదమును బడసి యాలయములో భాగముగా గ్రంథాలయము నేర్పాటుచేయ నుద్యమించితిని. కోర్కెలు ఊహాలు అడ్డులేక పొంగి పొరలుచుండెను. గాని శక్తిమాత్రము అతిహీనమై మనసును గష్టపెట్టసాగెను. కోరినదియు ఊహాకుఁ దోఁచినదియుఁ గావలయునను పట్టుదలమాత్రము సహజముగ నున్న దానికన్న నెక్కువగా నన్నావరించుచుండెను. అన్నివిధముల సమర్థుఁడయిన మహానుభావుఁడు శ్రీ హనుమంతుఁడుండగా కొంతలేనిచోటఁ గొండసమకూరుటగాని, శక్తిలేనివాఁడు పెద్ద గుడిని కట్టుటగాని అసం

భవములు గావను నమ్మకము మనసులో స్థిరమగుచుండెను. ఆరంభముులో దలపెట్టినదానికి బెక్కురెట్లు పనియు వ్యయము వృద్ధిగా సాగెను. దైవమునందు భారమువైచి చలనముమాత్రము చెందకుంటిని. మధ్య మధ్య "నాకేడ అంతటిపని దక్కునేడ" యను శంక దోచుచు వచ్చినను శ్రీ హనుమత్స్వామి పరిపూర్ణకృపాకటాక్షసామర్థ్యములవలన బని పూర్తిగాఁ జొచ్చెను. మనసు సదా భక్తిపూరితమయి ఆ స్వామివారి ధ్యానమునఁ జొచ్చెను. అట్లు రచించిన స్తవమే "శ్రీహనుమత్స్తవరాజ" మను ఈ చిన్న పొత్తమున బద్యరూపముగా నున్నది. ఒక్కొక్క ప్రదక్షిణమునకు నొక్కొక పద్యము చాలినదై ప్రదక్షిణాంతమున దేవుని దర్శనము గల్గునప్పటికిఎదురుగా నిలచి "నమస్కరింతు హనుమంతా నీ మహాశక్తికిన్" అని మకుటముచే బ్రణమింపఁదగి యుండును.

నాయాశయుఁ గోర్కెయు వ్యర్థముగానిరీతి నాయభిప్రాయముసు సంపూర్ణముగా గ్రహించి జనాకర్షణము, భక్తిప్రేరణము గలిగించు నసాధారణ సుందర శిలావిగ్రహమును బూర్తిచేసి యిచ్చిన నిపుణశిల్పియగు మైలాపూరు శ్రీ ధనాచలాచారిగారు నా కృతజ్ఞతకు నెంతయుఁ బాత్రులు. నేఁబూనిన పనిలోనన్నుఁ బ్రోత్సాహపరచుచు నామోదమును జూపుచు హృదయపూర్వకముగా నాకు సాయపడి ఆలయనిర్మాణ కార్యము యొక్క శాస్త్రానుకూల్యమునకు భంగము రాకుండఁ బరీక్షించుచు నాచేసిన హామామత్త్వమును బరిశీలించి ప్రవర్తింపఁ బురికొల్పిన విద్వద్వరేణ్యులగు బ్రహ్మశ్రీ కాశీకృష్ణాచార్యులవారు అత్యంతము నాకు వందనీయులు. సార్థకమగునట్లు ప్రయత్నించిన ధనమును నేగడించుటకుఁదగిన విద్యాబుద్ధులు చెప్పించి

పుత్త్రునిరీతి నన్ను సాకిన మత్పితృవ్యులగు బ్రహ్మశ్రీ పాటిబండ వేంకటరమణయ్య పంతులుగారు సదానాకు స్మరణీయులు. ఆలయనిర్మాణకార్యమునఁ గలుగుచు వచ్చిన యుద్ధైర్యమును, మధ్యమధ్య గలుగు పనుల యాలస్యమువలని భయమును, దలచినపని నైనప్పుడు గలిగిన సంతోషమును వెలిబుచ్చుచు శ్రీహనుమత్స్వామి కృపాసామర్థ్యములను గూర్చి తాత్కాలికముగా రచియించిన యొన్మిది పద్యముల నైతము నీక్రిందఁ బొందుపఱచుచున్నాను.

మ॥ భవదీయంబౌ చిన్న మండపమొన • ర్పంబూని యొక్కింతదా
దవులంగల్గు శిలాచయంబెటులఁ బ్రా • ప్తంబౌనటంచుఁ భయం
బవురా! యేటికఖండదూరగత భూ • ర్యద్రిప్రకాండంబుఁ జే
తవడిం దెచ్చిన నీవెయుండ హనుమం • తా! నిన్నె నే నమ్మితిన్॥

శా॥ ఉత్తుంగోర్వి ధరాగ్రవాసుఁడవు గుం • టూరన్ భవద్వాసమే
హత్తింపం దలపోసి సాధ్యమదిగా • దంచెంచియున్ నీపయిం
బత్తిం జేయఁగ, భూరిశైలవహన • ప్రాజ్ఞుఁడవీ చోటనా
యత్తంబయ్యె భవద్గృహంబు హనుమం • తా! నీ సహాయంబునన్॥

శా॥ ఆసక్తిన్నిరతంబు తావకపద • ధ్యానంబు ప్రాపింపఁగా
నానద్మస్థలివజ్ఞ నీ కొనఁగిరిన్ • సాధంబు; మజ్జన్మమొం
తే సాఫల్యముఁ జెందనం దమనికిన్ • వేవేగ రావే! భవ
ద్దాసత్వంబొన గూర్చి ప్రోవ హనుమం • తా! నిన్నదాఁ గొల్చెదన్॥

మ॥ చిరమేకాయ మశక్త మానవుఁడ; నా • చే దుర్ఘటంబైన మం
దిర మొందుర్ రచియింపఁ జేసితివి; త్వ • ద్వీర ప్రశస్తి ప్రప

త్రిరసోద్భాసిత మహాత్రింశద్గుణశ్రీ తిన్నిపు వేంచేసి నన్
ద్వరతోఁ జేయఁగదే కృతార్థు హనుమంతా! నీకృపాదృష్టిచే॥

మ॥ ధనమొక్కింత యివ్వఁ జాలరుదు; తద్భాగంబొకండైన మే
ల్పనికింబూన్పెడి కోర్కెయుబ్బరము; సం•త్రాస్వారంభముల్ మృగ్యముల్;
మన ముప్పొంగెడిచేత దుష్కరము;స • మ్యక్స్వస్థితికిన్ మొందువి
ఘ్ననికాయంబు; భవత్ప్రతిష్ఠ హనుమం•తా; నన్నెటుల్ తేర్చెదో॥

మ॥ ధనమా పుష్కలమైయొసంగదు; పర • ద్రవ్యాగ్రహాసక్తికిన్
మనమా పోదు! భవత్ప్రతిష్ఠ గనుమా • నానాటికిందాపుగాఁ
జనుఁదేసాగె! త్వదీయ శక్తిదృఢవి • శ్వాసంబు మాత్రంబువ
ర్తనమై యుండెడి! దరించుటెట్లు హనుమం • తా! నీ కృపం గాకికన్॥

మ॥ జయదుర్గా, రిక్షుద్ర; భక్తిమాత్రభరిత స్వాంతాబునం గ్రొత్తదా
గుడినిర్మించి భవత్త్రిమూర్తుల పటం బూర్పంగయత్నంబు చా
ప్పడెఁ; దత్త్రిక్రియలందు శాస్త్రిధనల • పంబుల్ పరీక్షింపకే
లేదు నీదాసుఁడటంచు సైచి హనుమం ! నన్ గటాక్షింపవే॥

శా॥ ఏమోచేసితి నీ పవిత్రతకు; నా • యీ తుప్పిగంతుల్ బళా
నీముందా యిఁకనేల ! భూభువనముల్ • నిండింతువీవే భవ
త్సామర్థ్యోన్నతిచే భవన్మహిమచే; • ధర్మాచలప్రోజ్జ్వల
త్స్వామీ! గత్రపురత్రిమూర్తి హనుమం • తా! విన్నదానమ్మిదే॥

రౌద్రినామ సం॥ర వైశాఖ
శు 5 లు ది 23-4-1920
గుంటూరు.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
భక్తుఁడు భాషాభిమాని,
పాటిబండ సూర్యనారాయణ॥

శ్రీహనుమతేనమః.

# హనుమత్స్తవరాజము.



శా॥ శ్రీరామాంఘ్రి నిరంతచింతనసము • జ్జీవన్మహా భక్తి వి
స్ఫారంబై సకలాగమోజ్జ్వలితమై • వంద్య త్రిమూర్తిప్రభా
కారంబై బలవీర్యశౌర్యమహిమై • కబ్రహ్మచర్యవ్రతో
దారంబయ్యె; నమస్కరింతు హనుమం•తా! నీ మహాశక్తికిన్॥ ౧

శా॥ సీతం గన్గొని రామచంద్రు ప్రతికిం • చెన్, రామునిం దెల్పి సీ
తాతన్వీం ప్రతికించె; మందుమలఁ జే • తం దెచ్చి సౌమిత్రిసం
ప్రీతిం దా ప్రతికించె; రామకథ కు • ర్వీం ప్రాణమై నిస్తుల
ఖ్యాతిన్నించె; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ ॥ 2

మ॥ ఖరతీవ్రాంశుమహాగ్రతాసహనమ • తుయ్యస్థితిం జిత్రిమే
కరణింగల్గెనొ! మింటలేచి భయశం • కాలేశశూన్యప్రభా
వరమున్ దుస్సహ చండభానుఁ గబళిం • పం జూచి లేఁ బ్రాయమం
దరుదై తోఁచె; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ ॥ 3

మ॥ అతిసూక్ష్మస్థితి నయ్యశోకతరు ష • ణ్డాంతస్థమైయున్న యా
కృతి యత్యద్భుతలీల వేగమ దశ • గ్రీవోచ్చసింహాస న
ప్రతిభాతిక్రమణక్రియాక్రమ మహో • గ్రస్ఫూర్తితో డన్మహో
న్నతిమైక్రాలె నమస్కరింతు హనుమం • తా! ని మహాకీర్తికిన్ ॥ 4

మ॥ ఒకచోసిల్వని లోకబాంధవు మహా • ద్యోగంబు భంగంబొన
ర్పక పూర్వాపరపర్వతాగ్రములపైఁ • బాదంబులన్నిల్పి చం
డకరాఘాతము లెక్కసేయ కవలీ • లన్నేర్చితో వేదశా
స్త్రకళారాశి; నమస్కరింతు హనుమం • తా! ని మహాకీర్తికిన్। 5

శా॥ అంగంబెల్ల మహోన్నత ప్రకృతిభూ • మ్యాకాశముల్ నిండ ను
ప్పొంగం జేసి యనన్యసాధ్యమని వే • ల్పుల్ సేయు గీతాళి వే
భంగుల్ గా శతయోజనాయత మహా • వారాన్నిధిన్ లీలనా
క్రంగం దాఁటు; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ 16

మ॥ సమరక్షోణి దశాస్య భీకరతరా • స్త్రశ్రేణిసంవిద్ధకా
యమృతప్రాయుల నేలఁగూలఁగ, వన • న్యప్రౌఢి దూరస్థ దు
ర్గమసంజీవినగంబు వే గొని సుమీ • త్రాణందనపాళిందా
నమునం గాల్చె; నమస్కరింతు హనుమంతా ! నీ మహాశక్తికిన్ 7

శా॥ లంకామార్గ సముద్రలంఘన సము • ల్లాసప్రమోద్ర యా
తంకావిర్భవఘోరరూపసురసా • దంష్ట్రాకరాళాస్య ని
శ్శంకోత్పాతపునర్బహిర్గమనద • క్షుంబయ్యె క్షేమప్రతా
పాంకస్ఫూర్తి! నమస్కరింతు హనుమం • తా! నిమహాకీర్తికిన్॥ ౮

మ॥ వనధిందాటఁగలేక నిల్చిన నిజ • స్వామ్యాత్మకుం బ్రీతిమై
కనుపింపం, బహుయోజనాయత మహా • గంభీరవారాశి పూ
డినదై సేతువుగాఁగఁ గేళి నిజము • ష్టిం దెచ్చి వైచెన్మహీ
ధ్రనికాయంబు నమస్కరింతు హనుమం • తా! నిమహాకీర్తికిన్॥ ౯

మ॥ అవనీదైవతవంశ సంభవ దశా • స్య ప్రాణహా న్యగ్రిపా
ఋషిపత్నీశివ ప్రతిష్ఠ నొనరిం • పంగోర్కె రామాత్మను
ద్భవిలన్ సేతువుఁ బజ్జకొక్క తృణమా • త్రం దెప్పెఁ గాశీస్ఫుర
ద్భవలింగంబు; నమస్కరింతు హనుమం • తా నీమహాశక్తికిన్ ॥10

మ॥ అకలంకా ప్రతిమానవర్తన, సము • ద్యద్భక్తి విశ్వాస, కా
ర్యకృతి ప్రౌఢి, మతిప్రభావిభవ ల • క్ష్మానన్య సాధ్యాంచితే
డ్య కలాపోత్తమ రామచంద్రకరప • ద్మాంచత్ప్రపూతాంగుళీ
యకమైమెప్పు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్

మ॥ కమలాక్షోరగనాథదేవ మహిమాం కచ్ఛాదకాంగాది సం
భ్రమకాంతార పరిభ్రమద్రఘుకుల • స్వామిద్వయాంతర్విభా
సి మహత్త్వంబౌక చూడ్కిలోన గ్రహియించెంబో! యనవ్య ప్రపూ
ర్ణమతిప్రౌఢిఁ నమస్కరింతు హనుమన్ • తా! నీమహాశక్తికిన్ ॥12

శా॥ దేవారాతి దశాననాదిక జగ • ద్భీత్యావహాద్విపా
జీవస్వేభ మృగేంద్ర కీర్తియుతవా • లి ప్రోద్ధతప్రాణ సు
గ్రీవత్రాణధురీణతంబాలిచె మం • తిత్వప్రభన్నించు ప్ర
జ్ఞావిక్రాంతిఁ నమస్కరింతు హనుమన్ • తా! నీమహాశక్తికిన్ 13

మ॥ అమరఖ్యేష్టసురేంద్ర దేవమునిము • ఖ్య స్తోమ సంస్తోత్రపా
త్రమహాగాథనిరూఢ భక్తిపరజా • గ్రిత్స్వాప్న సుప్తిక్రియా
సమశైవల్యపదప్రదానపటిమాం • చంద్రామరామేతి శ
బ్దమయంబయ్యె, నమస్కరింతు హనుమంతా! నీమహాశక్తికిన్ ॥14

మ॥ అవలీలన్నిజమూర్ధమందిడి యన • న్య ప్రాప్తిమైమర్గమో
గ్రవనీమోసె ననంతకోటిభువన • బ్రహ్మాండ భాండోదర
ప్రవచస్తోత్ర సముజ్జ్వలన్మహిమ కో • భా మూర్తి మంద్రామచం
ద్రవిభూత్తంను; నమస్కరింతు హనుమంతా! నీమహాశక్తికిన్ ॥15

మ॥ సకలాజాండ చరాచర ప్రకర ర • క్షావర్తియౌ రామమూ
ర్తికరాబ్జంబు భవద్భుజాగ్రములపై • బ్రీతిం బ్రసారించిమా
మకవంశంబు సముద్ధరించిన జగ • న్మాన్యుండితండంచమం
దకలంజూచె; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 16

మ॥ బలముం, వీర్యము, నీతియుం, మధుర సంభాషిత్వముం, సర్వశా
స్త్రలపాండితి, గాననైపుణి, కవి • త్వంబుం, మహాభక్తిపెం
పులమంత్రిత్వము, కార్యదీక్షయు, నజే • యత్వంబు, దైవత్వముం
గలిగన్నీకె; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 17

మ॥ పరిణతుల్ గాల్పెడిలోకరక్షకుని సే • వారక్తియుణ్, లోకబం
ధునిశిష్యత్వము, లోకశివమని స • త్సూనుత్వముం గ్గ్నియుం
టనులోకోపకృతిం బ్రవృత్తియుః బ్రస • న్నత్వంబు వీర్యంబునీ
తనువుం జెందె; నమస్కరింతు హనుమం • తా నీమహాశక్తికి॥18

మ॥ సముద్రగంబు భవత్ప్రతాపము! భుపం • జన్మించియుంగోతిగా
నమరత్వంబును జూరగొంటి నఖిలా • శాకీర్ణ దివ్యద్యుమం
ఘుమసౌరభ్యమయంబు ప్రోన్నతము నీ • కుం బ్రహ్మపట్టంబుసి
ద్ధముగానుండె; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి॥19

మ॥ భవదీయాద్భుత సాహసప్రథిత తీ । వ్రక్రూరవీర్యంబునే
దవుఁబ్రీత్యుతుము! తావకాహ్వాయము విన్నంతెంబటాపంచలై
స్తవముల్ సేయుచు భూతరాక్షసపి । చవ్రాతముల్ పాఱువే
దవులందాల; నమస్కరింతు హనుమం । తా! నీమహాశక్తికిన్ ॥ 20

మ॥ ఘనవిద్యాద్భుతమాద్వదస్ఖలిత దీ । ర్ఘబ్రహ్మచర్యానవ
ద్యనియామంబు! నిగూఢభక్తిపర చి । త్తాబ్జస్ఫురన్మానవా
ళిని సత్పుత్త్రవరప్రసాదమునఁదే । లించర్ భవద్దర్శనం
బునయంబుర్వి; నమస్కరింతు హనుమం । తా! నీమహాశక్తికిన్ ॥21

మ॥ అతిభక్తుండనటంచు ద్వైతులు విశి • ష్టాద్వైతుల ద్వైతుల్గా
స్తుతిపాత్రోత్తమవర్తనాధికుఁడవం • చున్నాస్తికుల్, సర్వస
మ్మతదివ్యాంశవటంచు నెల్లరును సం • భావింపఁగాఁగాంచినా
వతులఖ్యాతి; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 22

మ॥ అలవిద్యార్థులు, సేవకుల్, బుధులు, వే • దాంతుల్, మునుల్, భక్తవ
ర్యులు, యోగీంద్రులు, నీతివేదులు, సమా • త్యుల్, వైదికుల్, తార్కికుల్
బలయోధుల్, నినుమెచ్చబంతిగ నొన • ర్పన్ సర్వతః ప్రాజ్ఞవో
ద్భులమైయొప్పె; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 23

మ॥ ప్రకటానన్యకుశాగ్రబుద్ధివి! విభూ ♦ గ్రస్పర్ధియాంవాలి నే
టికిఁబోఁ గాఁగప్పు? వార్ధిఁదాఁటియుఁ జెనం ♦ టింబు క్తికంపుందురా
త్మకుఁ జెండాడవు సీతఁ దేవు తగు సా ♦ మర్థ్యంబునీ చెంతనుం
డకయా? కాదు; నమస్కరింతు హనుమం ♦ తా! నీమహాశక్తికిన్ ॥124

మ॥ పరిణుతానన్య సుదీర్ఘ యోజనుఁడవై ♦ రా! యాత్మమున్ప్రోల్చియున్
ఘనమారానుబలంబుఁ బెట్టితి పరీ ♦ క్షం, దూతగాఁబోయియుం
గనదుద్యానవనంబు నూడ్చితివి, లం ♦ కంగాల్చితత్యల్పవ
ర్తనమా? కాదు;నమస్కరింతుహనుమం ♦ తా! నీమహాశక్తికిన్ ॥125

మ॥ సమరోపాయధురీణ సత్త్వాండవాహా! • సంజీవి నింకంధరా
గ్రమునంగానక దస్సి యున్నరని వె • న్కంబోయితో! నీకుమి
న్న మెయింబెంచిన ధాన్యమాలి సురసా • సాధింపవో! నీకసా
ధ్యము లేదెందు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి ॥126

మ॥ ఒకరాజ్యంబున శిష్టులెల్లరు, మతిం • కొక్కంటదుష్టుండొకం
డిక వేల్లోక్కటశిష్టుండొక్కరుండెట్లో • యీమూటి సంధించి దు
ష్టకసంహారము శిష్టరక్షణము మె • చ్చంజేసె నీనీతి త
త్వకలాపంబు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి ॥127

మ॥ పరభృత్యత్వముఁ బూనివాఁడవఁట • బ్రహ్మాండపాథోధురం
ధరతం దాల్చి; బుధుండవయ్యు ననిజో • త్కర్షాంతరుద్యద్భవ
త్సరపోద్గ్రింధము మాపినావు! వినయా • చ్ఛాదంబహో! నీమహో
త్తర తేజంబు! నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్॥ 28

మ॥ చెలఁగున్ సంకటవేళలైనను నిజ • శ్రీయుఃశరానర్ఘసం
కలనోత్పాదకయుక్తి పాటవసమ • గ్రత్వంబు నీయందనన్
ఖలనిర్బంధితతావకీనతను దీ • ర్ఘస్థూలవాలార్పితా
నలమే సాక్షి! నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్॥ 29

మ॥ ఘనమాపాండితియో! మృదుత్వమొ! చమ • త్కారంబొ! మా
ధుర్యమో
యొనయన్ రాని గభీరభావమొ? మఱిం • కేమున్నదో! యాదిద
ర్శనమందించక నిప్పు భాషణమొన • ర్చన్ నిసమానుండులే
డనె రాముండు! నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ ॥ 30

శా॥ మా దేవుండు ఘనుండు మా గురుఁడు సం • భావ్యుండనన్ రాఘవం
బే దాఁగిం జనులెల్ల వాని కటులెం • తే నీచరిత్రంబగుం
గాదే! యైహికపారమార్థికఫలై • క శ్రీప్రదానప్రవి -
కాదర్శంబు; నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ । 31

మ॥ భువనసంరంభము సృష్టిసంభరణముం • గా, దుగ్ధ్రకోదండఖం
డనముం గాదు, శిలాప్రభూతమునికాం • తాశాపవిధ్వంసన
ర్తనముం గాదు; జగంబెఱుంగదా శ్రీ • రామావతారార్థసా
ధనమూలంబు! నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ ॥ 82

మ॥ జనకక్ష్మాపసుతా వియోగభవ శో • కల్యాత్మజ క్లేశనా
శనసత్కృత్యభిరామరామ చరితాం • చత్సుందరాధ్యాయది
వ్యలేశంబు సమస్తబాధలడంచు • ధాత్రిన్ విపద్బాంధవుం
డనంగన్నీవె! నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ ॥ 83

